[illegible] — [illegible]ని గడు మనోజ్ఞ ముగ వల్లువరు చిత్రించెను. ఈ ఖండము నాఁటి రాజకీయ జీవితమునకు దర్పణ మని నుడువవచ్చును. దైనందిన జీవిత ములో రాజకీయములకుఁ గల ప్రాధాన్యమెట్టిదో తిరువళ్లువర్ స్పష్టము చేసినాఁడు.

సైన్యము, ప్రజలు, కోశము, ఉపదేశికవర్గము, సఖ్య సంబంధము, దుర్గములు—ఈ యాఱును రాజునకు మిక్కిలి యావశ్యకములు. కోశము నభివృద్ధిచేయుటను, సంరక్షించు టను, సద్వినియోగము చేయుటను రాజు చక్కఁగా తెలిసికొని యుండవలయును. కఠినోక్తులతో ప్రజను బాధింపఁగూడదు. తన్ను దూషించువారిని గూడ నతఁడు మన్నింపవలయును. అధర్మము నరికట్ట వలయును. పక్షపాతమును విడనాడి సమ దృష్టితో న్యాయపరిపాలన మొనర్పవలయును. అట్టి పాల కుఁడు మానవ సంఘమున దైవముగ భావింపఁ బడును; జ్యోతివలె ప్రకాశించును.

రాజు విజ్ఞానసముపార్జనములో నప్రమత్తుఁడుగ నుండ గూడదు. పండితుఁ డెచ్చటికి వెళ్లినను తనతోబాటు సంతోష మును గూడ తీసికొని పోవుచుండును. కాని యతఁడు పోవు నప్పుడు విచారమును వదలి వెళ్లుచుండును. భిక్షుకుని వలె, ఉపాధ్యాయుని సమక్షమున వినయ వినమ్రుడై యతఁడు సంచరించి విద్యనేర్చుట యుక్తము. విద్యావంతునికి మాత్రమే నేత్రము లున్నట్లు గణింపఁబడును. విద్యా విహీనునికి నేత్రము లున్నను నవి రెండు గాయములు.

శ క్తి సంపన్నుఁడై నను రాజు దుర్గముల యందుండుటయే యతనికి శ్రేయస్కరము. నీటిలో నున్నంతవఱకును మొసలి సురక్షితముగా నుండును. వెలుపలికి వచ్చెనేని అది శత్రువుల కొక యాటవస్తు వగుచున్నది. కులీనుఁడును, దోషరహితుఁడును, అపయశస్సునకు వెఱచు వాఁడును నగు పురుషుని మాత్ర మే రాజు తనయుపదేశిక వర్గమునఁ జేర్చుకొనవలయును. దురాశ లేనివాఁడు, దయగలవాఁడు, మేధాసంపన్నుఁడునగు పురుషుఁడే ప్రభుత్వోద్యోగమున కర్హుఁడు. అభిమానమును పురస్కరించుకొని కాక, మంత్రియొక్క శక్తిసామర్థ్యములను, సహాన యుతమైన కార్యనిర్వహణమును గమనించి యతనిపై (ప్రభుత్వ) కార్యభారము వేయవలయును. విధ్యుక్త ధర్మ నిర్వహణమునందు సిద్ధహస్తుఁడగు సేవకుని సేవగించుకొను వానినుండి భాగ్యరేఖ తొలఁగిపోవును. ప్రతి రోజును రాజు ప్రతివిషయమును పరామర్శించి చూచుట మంచిది. ప్రభుత్వ కార్యాలయములు సక్రమముగా నున్నంతవఱకు రాజ్యమున కెట్టి ముప్పును వాటిల్లదు.

వర్షార్థము ఈ ప్రపంచము గగనవీధిని తిలకించుచున్నది; అటులనే తమ రక్షణార్థము ప్రజలు రాజదండమును జూచుచుందురు. ప్రజను ప్రేమార్ద్ర హృదయముతో పరిపాలించు పాలకులను రాచఱికము విడనాడనే విడనాడదు. న్యాయపరిపాలనము సాగినచో సకాలవర్షములు కురియును; సస్యసంపద వృద్ధి యగును. కరవాలము కాదు జయలక్ష్మిని తెచ్చునది; రాజదండము. అయితే యదియే ప్రక్కకును మొగ్గక

నిట్టనిలువుగ నుండవలయును. అధర్మపరుఁడైన రాజు క్రమ క్రమముగా రాజ్యరమను కోల్పోవుచుండును. అతని యైశ్వ ర్యము నశించుటకు కష్టచరితుల కన్నీరే కారణము. న్యాయ పరిపాలనము కీర్తికి హేతువు; అధర్మపాలన మపయశస్సునకు కారణభూతము. క్రూరుఁడైన నృపలయేశుని పరిపాలనము నందు దరిద్రునికంటె ధనికుఁడే దురవస్థకు పాల్పడుచున్నాఁడు. ధర్మయుతమైన పరిపాలనము లేనిచో నావుల పొదుగులలో పా లెండిపోవును; బ్రాహ్మణుఁడు [1] తన విధ్యుక్తధర్మమును విస్మరించును.

ఈ ప్రపంచము దయాదాక్షిణ్యములకు కట్టువడి యున్నది. ఈ దయాదాక్షిణ్యములే లేకున్నచో నేత్రము లుండియు మానవునకు లాభము లేదు. చల్లని చూపులే నేత్ర ముల కలంకారములు. దయావీక్షణములు ప్రసరింపని కన్నులు గల మానవులు భూరుహతుల్యులు. అపకృతి యొనర్చిన వారిని గూడ దయతో మన్నించుటయే మహోత్కృష్ట మగు గుణము. రాజనీతి శాస్త్రపరిజ్ఞానము, ఉపదేశిక వర్గము—ఈ రెండును రాజునకు కన్నులవంటివి. వార్తాహరులవలన రాజ్యాం గములో జరుగువిషయముల నెప్పటికప్పుడు తెలిసికొనుచుండ వలయును; లేదేని ముప్పు సంభవించును. వారి మాటలను

1. తిరువళ్లువర్ దృక్పథములో నాధ్యాత్మిక సంపన్ను లగుయోగులే బ్రాహ్మణులు; సర్వభూత సమదర్శిత వారికే యలవడును. బ్రాహ్మణులకు అన్దణర్ అని తమిళములో పేరు. అన్దణ్ మై యనఁగా కరుణ లేక జాలి.

గూడ లెస్సగా పరీక్షింపవలయును. పరీక్ష యొనర్పకయే వారిని నమ్మఁజనదు. భృత్యులను బహిరంగముగ సమ్మానింపఁ గూడదు; ఇట్లొనర్చినచో రాజు తన రహస్యములను తానే బహిరంగము చేసినవాఁడగు చున్నాఁడు.

ఇది యసంభవము - అనుచు పనిదొంగవు కాకుము. శారీరకపరిశ్రమయే తగినంత బలము నొసఁగును. భోగమును వాంఛింపక, పరిశ్రమించుట కభిలషించు నట్టి వ్యక్తి మిత్ర బృందమునకు గొప్ప యండగా నుండును; అతఁడే వారి బాధలను బాపఁగలడు. పరిశ్రమయే సౌభాగ్యమునకు మాతృక. సోమరితనము బాధలకు కారణభూతము. అదృష్ట హీనుఁడుగ నుండుటలో నగౌరవ మేమియు లేదు; కాని పరిశ్రమించుటకు విముఖత్వము తెలిపినచో నది యగౌరవ మునకు హేతువు.విధి సుముఖముగ లేకున్నను సరే, పరిశ్రమ తప్పక ఫలప్రద మగును. స్మితవదనుఁడవై దురదృష్టమును ప్రతిఘటింపుము. సౌఖ్యములే కాక కష్టములు కూడ ప్రకృతి సిద్ధములే యని విశ్వసించువాఁడు కష్టమునుజూచి భయపడఁడు. మంచిదినములలో నెవఁడు భోగములను కోరఁడో యతఁడు చెడ్డదినములలో సంభవించుకష్టములను చూచి బాధపడఁడు.

మంత్రి యీ క్రింది గుణములు కలిగి యుండవలయును. శత్రువుల మధ్య భేదములు కలిగించుట, మిత్రులతోడి సంబంధమును సుస్థిర మొనర్చుట, విడిపోయిన వారిని సంఘటిత పఱుచుట—మున్నగునవి. మంత్రి విద్యావంతుఁడై యుండ వలయును; ప్రజాశ్రేయస్సును వాంఛింపవలయును. పుస్తక

జ్ఞానముతోపాటు లోకజ్ఞానమును గూడ గడించి తదను గుణముగా ప్రవర్తింపవలయును. రాజు బుద్ధిహీనుఁడై యుండవచ్చును; చీటికి మాటికి నడ్డు తగులుచుండ వచ్చును. అయినను నేది సమంజసమో, న్యాయయుతమో దానినే మంత్రి రాజునకు తెలియఁజేయవలయును. ప్రభువును గూలఁ ద్రోయ వలయు నని కుట్ర పన్నునట్టి దుష్టమంత్రి యేడు కోట్ల శత్రువులకంటెను భయంకరుఁడు. శ్రోతలను వశము చేసికొను నట్లుగా సంభాషించు నేర్పు రాజకీయజ్ఞునికి ముఖ్యావశ్యకము. వాగ్మిత యుండి సభాకంపనమును, తికమకయు చెందక యుపన్యసించు వ్యక్తిని వాగ్వివాదములో జయించుట దుర్లభము. తమ హృదయమును తక్కువ మాటలలో వ్యక్తీకరింప లేనివా రెక్కువగా మాటలాడ నభిలషింతురు. ఆర్జించిన విజ్ఞానము నితరులకు సువ్యక్తము చేయలేనివారు వికసించియు సువాసనల విరజిమ్మ లేని కుసుమతుల్యులు. కీర్తి, లాభముల నొసఁగని కార్యముల పట్ల విముఖుఁడవు కమ్ము. అన్యాయార్జితవిత్తముతో నివసింప నభిలషించుట వేఁడిచే సరిగా గట్టిపడని మట్టి కుండలో నీటిని కాపాడ ప్రయత్నించుటవలె నుండును.

తన యాశయము ఫలోన్ముఖము చెందునప్పుడే కార్య సాధకుఁడు తదాశయమును బహిరంగము చేయును; అననుకూల కాలములో నాశయమును వెల్లడిచేసినచో విఘ్నము లేవైనను సంభవింపవచ్చును. దీర్ఘచర్చలకు ఫలితము నిర్ణయమునకు వచ్చుటయే; నిర్ణయము జరిగినపిమ్మట దానిని కార్యరూపము

లోనికిఁ దీసికొని వచ్చుటకు జాప్యము చేయుట తగదు. పరిస్థితులు సుముఖముగా నున్నచో గమ్యస్థానమునకు సూటిగా పొమ్ము; పరిస్థితు లననుకూలముగ నున్నచో ప్రతిఘటనము తక్కువగా నున్న త్రోవమూలముగా పొమ్ము. ముగింపబడని కార్యము, జయింపఁబడని శత్రుసైన్యము – ఇవి నిప్పురవ్వలతో సమానము. పురుషప్రయత్నము, త్రోవలోని యడ్డంకులు, లాభము–వీనిని లెస్సగ గమనించియే కార్యరంగమున ప్రవేశింపుము.

సద్వంశము, దయార్ద్రహృదయము, రాజులను వశము చేసికొను ప్రవర్తన–యివి రాయబారికి వలసిన లక్షణములు. మేధాసంపత్తియు, పాండిత్యమును, మనోహరాకృతియు నున్నవాఁడే రాయబారములు సలుపుట కర్హుఁడు. అతఁడు స్థిరచిత్తుఁడై యుండవలయును; నిష్కల్మషహృదయుఁడై యుండవలయును. చంపుదు మని భయపెట్టినను నిజమైన రాయబారి విధ్యుక్తధర్మమును విడనాడఁడు. నిప్పుదగ్గఱ కూర్చుండి చలి కాచుకొనువానివలె రాజునొద్ద మెలఁగువాఁడు రాజున కత్యంత సన్నిహితముగాను, చాల దూరములోను నుండఁగూడదు. హృదయరంజకము లగు విషయములనే రాజునొద్ద మాటలాడుట మంచిది; అడిగినను సరే లాభరహితము లైనవానిని గుఱించి మాటాడఁజనదు. ఒకని చూపుల నుండియే యతని భావములను నిర్ణయించుకుశలుని నుపదేశికవర్గములో చేర్చుకొనుము.

నీమాటలకు విలువకట్టుట నీకు తెలియునా? నీ శ్రోతలను లెస్సగా గమనింపుము; వారికి రుచించు నట్లుగా మాటా

డుము. విజ్ఞాననిధులైన పెద్దల ముందపజయము పొందుట ధర్మమార్గమునుండి పతనము చెందినట్లుండును. సర్వసమర్థులైన విమర్శకుల సమక్షమునందు పండితుని ప్రజ్ఞ ప్రతిభాసించును. నీకు తెలిసిన సర్వస్వమును పండితులయెడ ప్రదర్శింపుము ; తెలియని విషయములను వారియొద్ద నేర్చుకొనుము. తాను చెప్పఁదలచుకొనిన విషయమును వ్యక్తమొనర్పఁజాలని పండితుఁడు విజ్ఞాననిధియై యున్నను లాభము రవంతయు లేదు. పండితులే కావచ్చును ; కాని సదస్సులయందు మాటాడుటకు భయభ్రాంతులైనచో నపండితులకంటెను వారు నీచముగ పరిగణింపఁబడుదురు.

పయిడిపంటలకు కాణాచియై, సాధువులకును, ధనికులకును నివాసస్థానమై విలసిల్లునట్టిదే దేశము. శత్రువులవలని భయమును, కరవు కాటకములును, దేశద్రోహులును, హంతకులును, కలహించుకొను వర్గములును లేని దేశమే దేశము. ధనము, సస్యసౌభాగ్యము, సౌఖ్యము, భద్రత, రోగములవలని భయము లేకుండుట – ఈ యైదును రాజ్యమకు సుభూషణములు. సరియైనపాలకుఁడు లేకున్నచో నీ విశిష్టలక్షణము లన్నియు నిష్ప్రయోజనములే. మిత్రత్వమును సంపాదించుటకంటెను గష్టతరమైనది మఱియొకటి లేదు. యోగ్యులైనవారితోడి మిత్రత్వ ముద్గ్రంథములను చదువుట వంటిది ; వారిని సన్నిహితముగ ననుసరించినకొలఁది మనము వారియందలి వైశిష్ట్యమును గుర్తింపఁగలము. తఱుచుగా సంధించుటయో, మిత్రత్వము నెఱపుటయో కాదు కావలసి

నది ; హృదయైక్యమే మిత్రత్వమును దృఢపఱుచునది. చెడు త్రోవలనుండి మఱల్చి మంచిత్రోవలను సూచించువాఁడును, కష్టదశలో నాదుకొనువాఁడు నయినమనుజుఁడే సన్మిత్రుఁడు. బాగుగా పరీక్షింపకయే స్నేహితులను దగ్గఱకు చేర్చుకొను వాఁడు కష్టములను కూడబెట్టుకొనుచున్నాఁడు. మిత్రుఁడు తన పతనస్థితికి కారణభూతుఁడైనను సరే యతనిని సన్మిత్రుఁడు విడనాడఁడు. విద్యాధికుఁడైనను సరే శత్రువు తన హృదయ మందలి ద్వేషమును చంపుకొనఁజాలడు. మిత్రునివలె నటించుచుఁ గమ్మగా మాటలాడినను నొక్క నిమిషములో శత్రువు బయటపడిపోవును.

క్రూరుఁడును, శక్తిసామర్థ్యములు లేనివాఁడును, మిత్రులు లేనివాఁడును, మలినమనస్కుఁడు నగు రాజును జయించుట శత్రువులకు సులభకార్యము. పిఱికియు, నవివేకియు నైన రాజుతో యుద్ధము చేయుటకు వైరివీరులు చాల సంతసింతురు. శత్రువులను మిత్రులుగా చేసికొనినచో నతని యధికారమున కంతము లేదు. తెలియనివారికి నీ కష్టములను తెలియఁ జెప్పకుము. నీ యసామర్థ్యమును శత్రువుల కంటఁబడనీయకుము. చిన్నవిగా నున్నప్పుడే ముళ్ళచెట్లను నఱికివేయుము. అవి పెద్దవి యైనచో వానిని నఱుకుటకు పూనుకొను హస్తమునే నఱికివేయును. రహస్యముగ పగ సాధించు శత్రువునుండి రక్షించుకొన ప్రయత్నింపుము. మిత్రునివలె నటించు వైరిని విశ్వసింపకుము. ఆత్మీయుఁడు కనుక విరోధి యైనచో, నతఁడు నిన్ను కష్టపరంపరకు గుఱి యొనర్చును. తన్ను ద్వేషించు

పాముతో కలసి మెలసి సంచరించువాఁడు కాలసర్పగత కుటీరములో నివసించిన ట్లుండును.

మహనీయుల మనస్సు నొప్పింపకుండుటయే తన్నుఁ దాను సంరక్షించుకొను మార్గము. అధికారబలములు గల మనుజులతో బలహీనుఁడు వైరము తెచ్చుకొనుట మృత్యుదేవత నాహ్వానించుటవంటిది. ఆధ్యాత్మికశక్తి సంపన్నులగు వారి కోపపుచూపులు దేవేంద్రుఁడంతటి వానినిగూడ పదవీ భ్రష్టునిగా చేయును. భార్యను చూచి భయపడు వ్యక్తి మహనీయులకు సేవ యొనర్చుటకుఁ గూడ ధైర్యవిహీనుఁడై యుండును. కాంతాదాసులైన పురుషులు తమ స్నేహితుల మనోభీష్టములనుగూడ తీర్పలేరు; సత్కార్యమేదైననొకదానిని చేయఁజాలరు. స్వలాభపరాయణలై (ధనముకోరి) వశ మొనర్చుకొను వెలయాండ్రను సమీపింపకుము. వారితోడి సరస సల్లాపములు దుఃఖముననే దారి తీయును. ప్రేమ నభినయించుచు వేశ్య తన ప్రియుని కౌఁగిలించుకొనును; కాని యొక చీఁకటిగదిలో తనకు తెలియని మానవుని మృతకళేబరమును తాకినట్లుగా నామె భావించును. తమ కాంతలయందు గౌరవాభిమానములు గల పురుషులు వెలయాండ్ర హస్తమునైన స్పృశింపరు. హృదయద్వయముగల స్త్రీ, (వెలయాలు) త్రాగుడు, నెత్తపలక-ఇవి యదృష్టహీనుఁ డగు మానవునకు సంతోషప్రదములుగ నుండును. త్రాగుడున కలవాటుపడిన పురుషులు శత్రువులకు సులభప్రాయు లగుటయే కాక సంపదలనుగూడ కోల్పోవుదురు. ఉన్నధనమును

వెచ్చించి మద్యము సేవించి తత్ఫలితముగ బుద్ధిమాంద్యమును తెచ్చుకొనుటకంటెను నవివేకము మఱియొకటి లేదు. విష తుల్య మగుమద్యమును సేవించువారు నిద్రించువారితో తుల్యులు. జూదగాఁడు ఐశ్వర్య, పాండిత్యములనే గాక యాహార వస్త్రములను గూడ గోల్పోవును.

భుజించిన యాహారము జీర్ణమైన పిమ్మటనే భుజించు చున్నచో మందులతో నవసర ముండదు. మితముగ భుజించుట మంచిది. ఆకలి యగు నప్పుడే భుజించువ్యక్తిని నారోగ్యము సమీపించును; అటులనే యధికముగ భుజించు వ్యక్తిని వ్యాధి సమీపించును. నగుమొగము, నరము లేనిచేయి, తీయని మాట, జాలిగుండె-ఇవి యుత్తమమనుజునియం దుండును. సద్వంశజులు ధనాశచే పేరు పెంపులను కోల్పోవరు. పర్వతము వలెగంభీరముగా నున్నవారు సైతము నీచకార్యము చేసినచో తమ గొప్పతనమును కోల్పోవుదురు. మహాత్కార్యసాధనకు పూనుకొన వలయు ననునభిలాషయే గొప్పదనము. తద్భిన్నమే స్వల్పత్వము. సర్వమానవులు నొకేరీతిగా జన్మించుచున్నారు; కాని వారి జీవన విధానముల ననుసరించి పేరుపెంపు లేర్పడు చున్నవి. అందఱిని ప్రేమించుట, ఇతరుల తప్పులను గణింప కుండుట, నిజాయితి మున్నగునవి శీలమునకు స్తంభప్రాయ ములు. సచ్ఛీలసంపద గలవ్యక్తికి దారిద్ర్య మవమాన హేతువుకాదు.

రూపసామ్యముచే గాక సమాన గుణగణములచే మానవులు పరస్పరము ప్రేమించుకొందురు. ధర్మాభిరతులు,...

స్వార్థాపేక్షితులు, ఉపకారశీలుర నైనవారిని ప్రపంచమే ప్రస్తుతించును. నవ్వుటయే తెలియనివారు ఈ ప్రపంచములో పగటివేళ కూడ చీకటినే దర్శింతురు. ధనమే సర్వస్వ మని తలఁచి యెవరికిని ధనసహాయము చేయని లుబ్ధుఁడు పునర్జన్మములో దయ్యమై పుట్టును. దరిద్రులకు రవంతయు ధనసహాయము చేయని వాని ధనము, ఏకాంతమునందే వ్యర్థమై పోయిన యువతి యౌవనము వంటిది. అవమానమునందలి భీతి యుత్తములకు భూషణము గాదా? పురుష ప్రయత్నము, ఒకరి నొకరు లెస్సగా నర్థము చేసికొనుట — ఈ రెండును కుటుంబ గౌరవమునకు హేతువులు. కుటుంబమును సక్రమముగా నడపుటకు సమర్థుఁడు లేకున్నచో, నిక్కట్టులు సంభవించి యాకుటుంబము తుదకు చితికిపోవును.

ఈ ప్రపంచమునందలి వృత్తులన్నిటికిని వ్యవసాయమే తలమానికము. వ్యవసాయదారుఁడే యీ ప్రపంచమున కాహార మిడుచున్నాడు. కృషి సలుపని వారిని గూడ కర్షకుఁడే పోషించుచున్నాఁడు. కనుక నతడు సమాజమున కవసర మగుచున్నాఁడు. భూమిని దున్ని నివసించువారే నివసింతురు; తదితరు లొకరిపై నాధారపడి యున్నారు. తమ్ము నర్థించువారికి 'నాస్తి' యనకుండ సహాయ మొనర్చువారు కర్షకులే. కర్షకుడు చేతులు ముడుచుకొని కూర్చుండిన సర్వ వాంఛలకు స్వస్తి చెప్పినవారు (సన్యాసులు) కూడ బాధలకు పాల్పడుదురు. భూమిని దున్నుటకంటెను దానిని బలము చేయుట ఫలప్రదము. విత్తులు చల్లిన పిమ్మట నీరు పెట్టుట కంటెను కాపుదల ఫలప్రదము.

పొలము పేరలుక గల పడంతి వంటిది. ఆమెను సంతోష పఱుపవలయు నన్నచో కర్షకుండు సదా పొలము పనులలో నిమగ్నుండై యుండవలయును. అప్పుడే యామెకు సంతోషము కలుగును. కృషి యొనర్పక తన పేదఱికమును తలపోసి కొనుచు విలపించు నట్టి నిర్భాగ్యుని చూచి పొలము పడంతి నవ్వును. కస్సు బుస్సు లాడక సహార్షముగా నొసంగు నట్టి వారిని చూచి భిక్షుకుండు చాల సంతోషించును. భిక్షము వేయువా రున్నారు కావుననే భిక్షుకు లా వృత్తిని స్వీకరించినారు.

కామ ఖండము :

ఈ ఖండ మొక మధురమంజుల కావ్యము. ప్రేయసీ ప్రియులు ప్రప్రథమమున కలసికొనినప్పుడు వారిలో మధురాతి మధురమైన భావము లుదయించును. పిమ్మటనే వారు వలపు నేస్తము లగుదురు. కాని విధివశాత్తుగా వియోగ మేర్పడు నెడల వారు భగ్నహృదయు లగుదురు. తమ్ము చూచి యితరులు పరిహాసించు చున్నారేమో యని తలంచి తీఱని మనో వ్యథ కూడ వారు చెందుదురు. ఈ వ్యథ యీ ఖండములో తిరువళ్లువర్ కవితా శక్తిని, కల్పనా చాతురిని పురస్కరించుకొని యందాలు దిద్దుకొనినది.

కనుచూపు మేరలో కనబడుచున్న యీ బంగారు బొమ్మ[1] దేవత కాంబోలు. లేక లావణ్యలతిక కాంబోలును.

1. ఆమె యనంగా ప్రేయసి. అతం డనంగా ప్రియుండు. ప్రేమ స్వరూపులైన వారిరువురు తమ మనోభావములను స్మృతిపథములకుం దెచ్చుకొనుచుందురు.

ఇతఃపూర్వము మరణమనఁగా నేమో నాకుఁ దెలియదు; ఇప్పుడు తెలియవచ్చినది. అది విశాల నేత్రములు గల వెలఁది రూపమును ధరించినది. ఆమె నిరాడంబరముగ నున్నది. కాని యామె నయనములు మాత్రమ[illegible]రసము సాగించునట్టివిగా నున్నవి. మద్యము సేవించిన పిమ్మట గాని మత్తు కలుగదు; కాని చూచినంత మాత్రముననే కామము కలుగుచున్నది. ఆమెకు రెండు చక్షువులు గలవు. ఒకటి నా హృదయమును గాయపఱుచుచున్నది. మఱియొకటి యా గాయమును మాన్పుచున్నది. ఆమె నన్ను చూచినది; పిదప తల వంచినది. అనఁగా మా యిరువురి మధ్య మొలకెత్తిన ప్రేమాంకురమునకు నీరు పోయుచున్నది. నే నామెను చూచినప్పుడు, ఆమె భూమిని తిలకించును. ఆమెనుండి నేను దృష్టి మఱల్చినచో, ఆమె నన్ను చూచి మృదువుగా నవ్వును. ఆమె నాయొద్ద నున్నప్పుడు జీవిత మేర్పడుచున్నది; ఆమె సుదూరముగా నున్నప్పుడు మరణము సంభవించుచున్నది.

పూర్వ మతని చూపులే నాకు సంతోషజనకములుగ నుండెడివి; కాని యిప్పుడో (వియోగ మేర్పడనున్న సమయమున) అతని కౌఁగిలి కూడ విచారజనకముగా నున్నది. అతఁడు నన్ను విడనాడినచో, తిరిగి మేము కలసికొందుమో లేమో! తాకిననే గాని అగ్ని వలన ప్రమాద మేర్పడును; కాని ప్రేమ[2] వలె, దూరముగా నున్నప్పుడు అగ్ని దహింపఁజేయునా? మిత్రరత్నములు లేనిచోట జీవితము గడపుట కష్టము. హృద.

2. ప్రేమవలన విరహాగ్ని యేర్పడుచున్నది.

యేశ్వరుని వియోగమును పొంది జీవించుట కష్టతరము. ఈ దుర్భర వియోగదుఃఖము ననుభవించుకొనుట నాకు వీలుకాకున్నది; కాని యీ దుఃఖమునకు కారకుఁడైన ప్రియునితో నీ విషయమును చెప్పుటకే సిగ్గు పడుచున్నాను. ప్రేమ సంతోష సాగరము వంటిది; కాని యీ వియోగసంజనిత దుఃఖ మా సముద్రముకంటెను చాల పెద్దది. నా హృదయమువలె నా నయనములు కూడ నతని యొద్దకు పరువు లెత్తినచో, అవి యశ్రుజలధిలో నీదులాడ నక్కఱ లేదు.

ఎందులకో యీ కన్నులు నేడు నాతో మొఱపెట్టుకొనుచున్నవి! నాప్రియుని నీ నయనములు చూపుటవలననే గదా నాకీ దుర్భరదుఃఖ మేర్పడినది. ముందు వెనుకలు చూడక నాఁడు చేసిన పనికి నేఁడు దుఃఖింప నేల? ఫలితమును సహనముతో ననుభవింప వలసినదే. అతఁడు దూరగతుఁడై యున్నప్పుడు నా కన్నులకు నిద్దుర పట్టుటలేదు; అతఁడు మఱలివచ్చినచో అప్పుడును వీనికి నిద్ర పట్టదు. కావున ఎట్లు చూచినను బాధ ననుభవింపవలసినదే వీనిపని. నా ప్రియుని సాగనంపినది నేనే గదా. కనుక నాస్థితినిగుఱించి యెవరితో చెప్పుకొందును? ఒకరి నొకరు పరస్పరము ప్రేమించుకొనిన వారే విజయగర్వ మందవచ్చును. ఇతరులు ప్రేమించి మాత్ర మేమి లాభము? భర్తచే ప్రేమింపఁబడని ప్రమదకు సౌఖ్య మన నేమో తెలియదు. భర్తయొద్దనుండి ప్రేమపురస్సర మైన సందేశములు పొందనిమహిళ జీవితము సాగించుచున్నచో నామె కఠినహృదయ.

పూర్వస్మృతులను జ్ఞప్తికి తెచ్చుకొను నప్పుడు కూడ ప్రేమ సంతోషప్రదముగా నుండును. మద్యము కంటెను అది మధుర మైనది. మా సమాగమమునకు సంబంధించిన పూర్వస్మృతుల నాధారము చేసికొనియే నేను ప్రకృతము మను చున్నాను. పుష్పముకంటెను ప్రేమ మృదులాతి మృదులము. దాని మృదుత్వమును గ్రహించి సుకుమారముగ సంరక్షించు వారు కొద్దిమందియే. నన్ను చూచినప్పు డామె నయనములలో నసంతృప్తి యుండెను; కాని నే నామెను సమీపించినంతనే నాకంటెను ముందుగా నామెయే నా బాహువల్లరిలోనికి వచ్చినది.

అతఁడు నా సమీపమున నున్నపు డతనిలో దోషము లేమియు నాకు కనఁబడలేదు; అతనిని చూడని వేళలందు దోషములు తప్ప మఱి యితరము లేవియు నతనిలో నాకు కనఁబడవు. ఈ హృదయమువలన ఏమి ప్రయోజన మున్నది? ఏకాంతముగా నే నాలోచనలయందున్నప్పు డీ హృదయము నన్ను నమలి మ్రింగుచున్నది. ఆహారమును భుజించునప్పటి కంటెను, అది జీర్ణ మగు నప్పుడే మధురముగా నుండును; అటులనే కౌఁగిలికంటెను ప్రణయకలహమే మధురముగ నుండును.

ఇటుల తిరుక్కురళులో ధర్మార్థ కామములకు సంబంధించిన విషయములు పెక్కులు మనోజ్ఞముగ విశదీకరింపఁ బడినవి. ఈ వివిధవిషయము లన్నియు లౌకిక జగత్తునకు సంబంధించినవై యుండుట హర్షింపఁ దగిన యంశము. తమిళ

వేదమును పఠించిన పిమ్మట పఠితకు నీ విషయాదికము ప్రధానముగ స్ఫురించును. పాలకులు, పాలితులు-అందఱును ధార్మికులై యుండవలయును. అధర్మమార్గములో సంచరించినప్పటికిని సౌఖ్యము కలిగినను, అధర్మమార్గము మాత్ర మనుసరణీయము గాదు. శాశ్వతసౌఖ్యమును ప్రసాదించు ధర్మపథము నవలంబించుటయే మానవుని పరమాశయమై యుండవలయును. మానవుని దుఃఖములకు కారణభూతములు కామ, క్రోధ, మోహములు. ఇవి విసర్జితము లైన నాఁడే దుఃఖము లన్నియు నశించును. తిరువళ్లువ రీవిషయము నిట్లు సుస్పష్టము చేసెను.

"కామం, వెగుళి, మయక్క మివై మూన్రన్
నామం కెడక్కెడునోయ్:"

[కామక్రోధ మోహములు మానవునినుండి తొలఁగె నేని నతని యిక్కటు లన్నియు తొలఁగిపోవును.]

మహాతత్త్వవేత్తయైన తిరువళ్లువర్ దృక్పథములో కృషికుఁడే పరమపూజ్యుఁడు. ఈ విశాలవిశ్వమున కాహార మిడునది కర్షకుఁడే. అతఁడు సోమరి యైనచో ప్రపంచము బాధలకు గుఱి యగును. కనుక నే సేద్యవృత్తిని కొనియాడి నట్లుగా తిరువళ్లువరు మఱి యే యితరవృత్తిని కొనియాడ లేదు. ప్రేయసీ ప్రియు లెట్లుండవలయునో తిరువళ్లువరు వర్ణించిన విధముకూడ పేర్కొనఁదగినదే. మనస్ఫూర్తిగా నొకరి నొకరు ప్రేమించుకొని యుండవలయును. ప్రేమవల్లరి వారి హృదయము లనుపందిళ్లమీఁది కెగఁబ్రాకవలయును. అట్టిదే పవిత్రప్రేమ. ఈ హేతువుచే కాఁబోలు ప్రణయ

కలహాముకూడ నళ్లువర్ కవికి మధురాతి మధురముగ ద్యోతక మయ్యెను.

## తమిళవేదముపై సంస్కృతవాఙ్మయ ప్రభావము :

తిరుక్కురళ్ స్వతంత్రగ్రంథ మనియు, దీనిపై సంస్కృతవాఙ్మయ ప్రభావ మేమియు లేదనియు కొందఱు తమిళభాషాపండితులు నుడువుదురు. కాని సత్యాన్వేషణమే లక్ష్యముగా నుంచుకొని తిలకించినచో పై మాటలు కేవలము స్వభాషాభిమాన జనితము లనియే తేటతెల్లము కాఁగలవు. తిరుక్కురళుపై సంస్కృతవాఙ్మయప్రభావము స్పష్టముగ కనఁబడుచున్న దని పేర్కొనినవారిలో ప్రథములు శ్రీ వి. ఆర్. రామచంద్ర దీక్షితరుగారు.[1] వీరి ననుసరించి కీర్తిశేషులు శ్రీ పి. టి. శ్రీనివాసఅయ్యంగారు[2] కూడ తిరువళ్లువరు గొప్ప సంస్కృతపండితుఁడై యుండ నోపు ననియు, సంస్కృతమందలి నీతి, అర్థశాస్త్రగ్రంథములను లెస్సగ నభ్యసించి యుండు ననియు తలఁచిరి.

మనుస్మృతి, చాణక్యుని అర్థశాస్త్రము, హితోపదేశ పంచతంత్రములు, భర్తృహరి సుభాషితములు కామందకుని

1. శ్రీ దీక్షితరు మదరాసు విశ్వవిద్యాలయమున చరిత్ర, పురాతత్వ శాఖయందు ఆచార్యపదవి నలంకరించిరి. ఇటీవలనే కీర్తిశేషు లయిరి. Purana Index, Hindu Administrative Institutions, The kural అనునవి వీరిగ్రంథములందు ముఖ్యములు.

2. 'History of the Tamils' పుటలు 589-95.

నీతిసారము మున్నగువానితో తిరువళ్లువరునకు పరిచయ ముండి యుండు నని భావింపఁబడుచున్నది. ఈ గ్రంథము లేకాక రామాయణ మహాభారతములు కూడ సుపరిచితములుగ నుండె నని నుడువవచ్చును. ఏలయన కురళులోని కొన్ని పద్యములకు మాతృక లనఁదగిన శ్లోకములు పై గ్రంథము లందును గానవచ్చుచున్నవి. ధర్మఖండములో మనుస్మృతిని, అర్థఖండములో కౌటిల్యుని అర్థశాస్త్రమును, ఎడ నెడ హితోపదేశ, పంచతంత్ర, భారతాదులను తిరువళ్లువ రనుస రించెను. చతుర్విధపురుషార్థములలోని ధర్మార్థకామములను మాత్రమే స్వీకరించి తద్విధముగ తన గ్రంథమును విభజించి, రచన సాగించుటకూడ తిరువళ్లువరుపై సంస్కృతప్రభావ మున్నట్లు చెప్పకయే చెప్పుచున్నది. 'కురళ్' పద్యరచనా విధానము సంస్కృత సూత్రరచనావిధానమును పోలియుం డుట కూడ పై విషయమునకు ప్రబలసాక్ష్యముగా నున్నది.

గృహస్థాశ్రమ ధర్మములను వివరించుచు వళ్లువ రిట్లు నుడివెను. "సముద్దేశములు కలవాఁడును, ఆశ్రమత్రయ మును (బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములు) సంరక్షించువాడును నగుమనుజుఁడే గృహస్థు." (కురళ్-41) ఈ యర్థమును స్ఫురింపఁజేయు శ్లోకము మనుస్మృతియందును గలదు.

'యస్మాత్రయోఽప్యాశ్రమిణో
జ్ఞానే నాన్నేన చాన్వహం
గృహస్థే నైవ ధార్యంతే
తస్మాజ్జ్యేష్ఠాశ్రమోగృహీ'

మానవుఁడు కష్టపరంపరకు పాల్పడుటకు ముఖ్య హేతువులు కామ, క్రోధ, మోహములే యనియు, వీనిని త్యజించినపుడే యతఁడు కష్టములనుండి బయటపడు ననియు తిరుక్కురళ్ పేర్కొనుచున్నది. (కురళ్ 360) ఇటులనే భగవద్గీతయందలి

'విహాయ కామాన్యస్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకార
స్స శాంతి మధిగచ్ఛతి.'

యను శ్లోకము నుడువుచున్నది. కామక్రోధమోహములను విడనాడినవాఁడు శాంతిని పొందుచున్నాఁడని గీత పేర్కొను చుండఁగా, కష్టములనుండి విముక్తి పొందుచున్నాఁ డని కురళ్ నుడువుచున్నది. కష్టజలధినుండి గట్టెక్కినపిమ్మట లభ్య మగునది శాంతియే.

కూర్మము తన యవయవములను లోనికి ముడుచుకొను చున్నట్లుగా మానవుఁ డింద్రియవికారములను నిగ్రహించు కొనుచు ప్రజ్ఞావంతుఁ డగుచున్నాఁడు—అని భగవద్గీత నుడువుచున్నది.

'యదా సంహరతే చాయం
కూర్మోఽఙ్గా నీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య
స్తస్యప్రజ్ఞాప్రతిష్ఠితా.'

ఇటులనే కురళుకూడ, '"కూర్మమువలె నైదింటిని (పంచేంద్రియములు) ఒకటిగా నెవఁడు చేయఁగలుగునో యతఁడన్నిలోకములందును కీర్తిని గడించుచున్నాఁడని పేర్కొనుచున్నది. (కురళ్ 126)

అర్థఖండమునందు తిరువళ్లువరు పాలకులనుగుఱించి పెక్కు విషయములు పేర్కొనెను. రాజు సప్తాంగయుతుఁడై యుండవలయు నని కురళ్ నుడువుచున్నది. ఇటులనే వళ్లువరునకు పూర్వుఁడైన చాణక్యుఁడు తన అర్థశాస్త్రమునందు సప్తాంగముల నుదాహరించెను.

'స్వామ్యమాత్య జనపదదుర్గకోశ దండమిత్రాణి'— అమాత్య, జనపద, దుర్గ, కోశ, దండ, మిత్రములు రాజునకావశ్యకములు, అర్థశాస్త్రము ననుసరించియే కాఁబోలు వళ్లువర్ కూడ,

"పడై, కుడి, కూళ (ழ) మైచ్చు, నట్పరణాఱు
ముడైయా నరశరు శేఱు"[1]

అని సప్తాంగములను ప్రశంసించియున్నాఁడు.

ఆంధ్రభోజబిరుదవిరాజితుఁడగు శ్రీకృష్ణదేవరాయలవారు కూడ నీ సప్తాంగప్రశంస నెఱపియుండుట గమనింపఁదగినవిషయము :

1. పడై = సైన్యము. కుడి = ప్రజ. కూళ్ (ழ) = ఆహారము. అమైచ్చు = మంత్రి. నట్పు = మిత్రత్వము. అరణ్ = గిరిదుర్గము, స్థలదుర్గము, వనదుర్గము, జలదుర్గము.

"స్వామ్యమాత్య సుహృత్కోశజనపదబల
దుర్గములు స్వామి గలిగినఁ దొలఁతఁ గలవు;
అంగి సుఖియైన నంగంబు లటకు మునుపె
చాల సుఖులౌట మనకు దృష్టంబు గాదె—"

ఇటుల సంస్కృతరచనములకును, తిరుక్కురళునకును పోలికలు కొన్ని కనఁబడుచున్నవి. సంస్కృత శబ్దములే గాక, సంస్కృత రచయితలు పోయిన పోకడలుకూడ తిరుక్కురళులో కనఁబడుచుండుటచే వళ్లువర్ కాలము భేదాభిప్రాయములకుఁ బాల్పడుచున్నది. మీఁదు మిక్కిలి యితఁడు జైనుఁడనియు ప్రబలవాదము కలదు. జైన, బౌద్ధాచార్యుల చల్లని చూపులవలననే తమిళవాఙ్మయమునకు రూపురేఖలు కలిగినవి. తమిళ పంచకావ్యములుగా గణింపఁబడు శిలప్పదిగారం, మణిమేకలై, జీవకచింతామణి, నీలకేశి, మున్నగునవి జైనబౌద్ధుల సారస్వతకృషికి ఫలించిన పూర్ణఫలములు.

క్రీస్తుశకము 5,6 శతాబ్దములలో జైనబౌద్ధమతములును, శైవవైష్ణవములును దక్షిణాపథమున విశేషవ్యాప్తిలో నుండెను. సాంస్కృతికముగ దాక్షిణాత్యులకును, ఔత్తరాహులకును సంబంధము లేర్పడినసుదినము లవి. కావున సంస్కృతరచనములు వళ్లువర్ వంటి మహాత్మునకు సుపరిచితములై యుండెననుట నిజమునకు దగ్గఱిచుట్టముగానే యుండును. ఈ హేతువుచే తిరువళ్లువర్ క్రీ. శ. 5,6 శతా

బ్దులయందు నివసించి యుండె నని నుడువవలసి యున్నది.[1]

సంస్కృత వాఙ్మయ ప్రభావము కొంతవఱకు నున్నను, తమిళ వేద మగు తిరుక్కురళ్ స్వతంత్రరచనమువలె భాసించు చున్నది. ప్రాక్ప్రతీచీ దేశీయుల సంస్తుతిని సముపార్జించిన మహాగ్రంథము తిరుక్కురళ్. కావుననే యది సార్వజనీన వేద మనుట. మహాకవి పాలకురికి సోమనాథుఁడు,

"అల్పాక్షరముల ననల్పార్థరచనఁ
గల్పించుటయ కాదె కవివివేకంబు"

అని నుడివినట్లుగా, అల్పాక్షరములతో ననల్పార్థరచన చేయుట మహాకవులకే వీలగును. కొండంత భావమును రెండు పాదముల పద్యములో నలఁతి యలఁతి మాటలతో కుదించి చెప్పిన ప్రతిభా గరీయస్కుఁడు తిరువళ్లువనాయనార్.

ఏతన్మహామూర్తి సంతరించిన మధురమంజుల కావ్యము తమిళ వేదము !

కృష్ణార్పణ మస్తు.

1. 'From the predominance of Aryan ideas and the free use of Sanskrit words, Tiruvalluvar cannot be assigned to any century earlier than the VI'–P.T. Srinivasa Iyengar, M.A.,

# తిరుక్కుఱళ్

(మూలము)

1. అకర ముదల వెళు(ழு)త్తెల్లా మాది
   బగవన్ ముదట్రే యులగు.

2. కట్రదనా లాయ పయనెన్కొల్ వాలఱివ
   నట్రా డొళా(ழா)అ రెనిన్.

1. కెడుప్పదూఉం గెట్టార్కు చ్చర్వాయ్ మట్రాంగే
   ఎడుప్పదూఉ మెల్లా మళై. (ழை)

2. నీరిన్ [1]అమయా దులగెనిన్ యార్యార్కుం
   వానిన్ అమయా దొళు(ழு)క్కు.

---

1. తమిళములో 'న్ అ' అను నక్షరముల నుచ్చరించునపుడు న్డ యను ధ్వని కలుగును.

# తమిళ వేదము

(తెనుఁగుసేఁత)

## దైవస్తుతి

ఆద్యక్షర మకార మన్నివర్ణముల
కాద్యుఁడై జగమున కజుఁ డొప్పినటుల.

శిష్టుఁడై నట్టిదేశికుఁ గొల్వ కున్నఁ
గష్టించి నేర్చిన కళలెల్ల సున్న.

## వర్ష ప్రశంస

వర్షమే నరునకు పతనభూతమ్ము
వర్షమే యతని సంపదకు మార్గమ్ము.

నిలువ దీ లోకమ్ము నీరు లేకున్న
జలమున్న శీలముల్ సాగునో యన్న !

1. గుణమెన్నుం కున్‌ఞేటి నిన్‌ఞార్ వెగుళి
కేణమెయుం కాత్త లరిదు.

2. అన్‌దణ రెన్నోప్ రఱవోర్‌మ ప్రెవ్వయిరుక్కుం
సెన్‌దణ్ణైత్ర పూణ్డొాళ(ఴ)గ లాన్.

1. అఱుత్తినూం (ఊ) గాక్కుము మిణ్ణై యదనై
మఱుత్తలి నూంగిణ్ణై కేడు.

2. సిఱప్పినుం సెల్వము మీను మఱుత్తినూం (ఊ)
గాక్కు మెవనో వుయిర్‌క్కు.

## యతిప్రశంస

సాధుగుణంబు లక్షశైలమం చెక్క
సాధుకోపం బొక్కక్షణమోర్వఁ దరమె?

భూసురుం డధ్యాత్మబుద్ధి సంసిద్ధి
భాసించు సమదర్శిభావ సంవృద్ధి.

## ధర్మప్రశంస

ధర్మలాభము కంటె ధనమెద్ది జగతి
ధర్మనాశముకంటెఁ దగుపాప మెద్ది?

ధర్మమే నరునకు ధనలాభ మొసఁగు
ధర్మమే పర మిచ్చి తనకుఁ బేరొసఁగు.

1. ఇల్‌వాళ్(ழ)వా నెన్బా నియల్బుడైయ మూవర్క్కు-
నల్లాట్రి నిన్ఱ తుణై.

2. తుఱన్దార్క్కుం తువ్వా దవర్క్కు- మిఱన్దార్క్కు-
మిల్‌వాళ్(ழ)వా నెన్బాన్ఱుణై.

1. దెయ్వన్ తొళా(ழா)అళ్ కొళు(ழு)నట్రొళు(ழு)
పెయ్యెనప్పెయ్యు మళై (ழை) [తెళువాళ్

2. తఱ్కాత్తు త్తఱ్కొండాఱ్ పేణి త్తగైశాన్ఱ
సొఱ్కాత్తు చ్చోర్విలాళ్ పెణ్.

## గార్హస్థ్యము

ధర్మసంబద్ధులై తనరు మువ్వురకు
నిర్మలుఁ డౌగేస్తు నిక్కంపు దిక్కు.

యతులకు, మృతుల, కభ్యాగతాసులకు
పతిదీనులకు నింటియజమాని దిక్కు :

## సహచరి

పరదైవముల వీడి పతిఁగొల్చుచాన
కురియు మన్నంతనే కురియదే వాన.

ధర్మరక్షణయుక్తిఁ దనోర్మికొనుచు
నిర్మల యౌకాంత నిజనాథుఁ బ్రోచు.

1. తంపొరు ళెన్బదాం మక్కళ్ ళవర్పొరు
డందమ్ వినైయాన్ వరుం.

2. అమిళ్(ఴ్) తిను మాట్ర వినితేదం మక్కళ్
శిఱుగై యళావియ కూళ్(ఴ్).

1. అన్బీను మార్వ ముడైమై యదువీను
నణ్బెన్ను నాడా చ్చిఱప్పు.

2. పుఱత్తుఱు ప్పెల్లా మెవన్‌నెయ్యుం యాక్కై
యగత్తుఱు ప్పన్బి లవర్కు.

## సంతానము

చిట్టిచేతుల తోడఁ జిటిపాప కలువు
పట్టెడన్నమె సుధాప్రాయమ్ము గొలువు.

జనకుఁడు మున్ను నోఁచిన నోముపంట
తనయుఁడై కర్మకుఁగా దగి పుట్టు నింట.

## ప్రేమ

ప్రేమి కందఱియెడ ప్రేమ రేకెత్తు
ప్రేమయె సదయమైత్రికి మేలియెత్తు.

సదమలాత్మకు ప్రేమ సరిక్రొత్తసొమ్ము;
అదిలేని పైతళుకు లెదకు భారమ్ము.

1. విరున్దు పుఱ త్తతా త్తానుణ్డల్ సావా
మరున్దెనినుం వేణ్డాఱ్పా ట్రన్ఱు.

2. విత్తుమిడల్ వేణ్డుం కొల్లో విరున్దోంబి
మిచ్చి≡ మిశై వా≡ పులమ్.

1. అగనమర్న్దీదలి న≡తే ముగనమర్న్ది≡సొల నాగ ప్పెఱి≡.

2. ఇనియ వుళవాగ విన్నాద కూఱల్
కనియిరుప్ప క్కాయ్కవర్≡ దట్రు.

## అతిథి సత్కారము

వాకిట నిలుచునభ్యాగతిఁ మాని
తాకంగ నగునె సుధారసం బేని.

అతిథికిఁ బెట్టి తా నవల భుజియించు
నతనిక్షేత్రము బీజ మందకే మొలచు.

## మధురభాషణము

కసరి యిచ్చినదాని కంటె—రమ్యోక్తిఁ
బస మించుమోముతోఁ బలుకుటే రక్తి.

లలితోక్తు లుండ దుర్లలితోక్తు లాడ
ఫలముండఁ గాయకై బ్రమయుటఁ జూడ.

1. కాలత్తి నాఱ్సెయ్ద నన్ఱి సిఱిదెనిను
ఞాలత్తిన్ మాణ ప్పెరిదు.

2. పయన్దూక్కార్ సెయ్ద వుదవి నయన్దూక్కిన్
నన్మై కడలిన్ పెరిదు.

1. కాక్క పొరుళా వడక్కత్తై యాక్కమ్
మదనినూం గిల్లై యుయిర్క్కు.

2. తీయినాఱ్ సుట్టపుణ్ ణుళ్ళాఱు మాఱాదే
నావినాఱ్ సుట్ట వడు.

## కృతజ్ఞత

పొంచి మే లదనునఁ బొనరించి యుంటి
కొంచెమేని, బరువగున్ భూమికంటె.

ఫలముఁ గోరని మేలు తెనిసి కావింపఁ
గొలఁది యయ్యు, ఫలాన జలధికిన్ గొప్ప.

## ఆత్మనిగ్రహము

నిధివంటి దగునాత్మనిగ్రహశక్తి
విధిగ రక్షించు—జీవితధనం బద్ది.

చుల్కనగా మానుచుండుఁగా పుండు
నాల్కచేఁ గాల్చిమాన్పఁగ లేఁడెవండు.

1. మఱప్పిను మొత్తు కొళలాగుం పార్ప్పాన్[1]
పిఱప్పొళు(ழு)క్కం కున్ఱ కెడుమ్.

2. ఒళు(ழு)క్క ముడైమై కుడిమై యిళు(ழு)క్క
మిళి(ழி)న్ద పిఱప్పాయ్ విడుం.

1. అగళ్(ழ்)వారై త్తాంగు నిలమ్పోల త్తమ్మై
యిగళ్(ழ்)వార్ ప్పొఱుత్త ఱలై.

2. తుఱన్దారి న్ఱూయ్మై యుడైయ రిఱన్దార్వా
యిన్నాచ్చొ ల్నేఱ్కిఱ్ బవర్.

1. పార్ప్పాన్=వేదములను జూచువాఁడు. తమిళులు నేఁటికిని బ్రాహ్మణుని నీ పేరున వ్యవహరించుచున్నారు. ఈ శబ్దము ననుసరించి కాఁబోలు తెనుఁగులో బాఁపఁడు, పాఱుఁడు-అనునవి యేర్పడియుండును.

## సత్ప్రవర్తనము

శ్రుతులు మఱచిన నేర్చుకొనఁగా వచ్చు
పతితుఁ డౌద్విజుఁడు పూర్వగతి నెట్లొందు ?

మంచి నడత వంశమర్యాద నిలుపు
కొంచెపు నడత దుష్కులునిగాఁ దెలుపు.

## సహనము

తనకుఁ గీడైనను తాల్మియే మేలు.
తనను ద్రవ్వినవారి ధర యోర్చి యేలు :

కుజన దుర్భాషలకున్ దల యొగ్గ
సుజనులే యాశ్రమస్థుల కంటె లగ్గ.

1. అవ్వియ నెంజత్తా నాక్కాముం సెవ్వియా≡
కేడు నినైక్కా ప్పడుమ్.

2. అవ్వి త్తళు(ఴు)క్కా ఉడైయానై చ్చెయ్యవ
డవై వయై క్కాట్టి విడుమ్

1. నడువిన్ఱి నన్పొరుళ్ వెఃకిఱ్ కుడిపొ≡ఱి
క్కుట్రము మాంగే తరుమ్.

2. అఃగామై సెల్వత్తిఱ్ కియాదెని≡ వెఃగామై
వేణుమ్ పిఱ≡కై ప్పొరుళ్.

## ఈర్ష్య చెందకుండుట

చాల చిత్రము! దయాశాలి కౌ లేమి;
క్రాలదే కడుపుబ్బరపువాని కల్మి.

పరుల సంపద కీర్ష్య పడువాని గృహముఁ
దొరఁగి, యక్క కొసంగి సిరి జాఱు నిజము.

## అన్యాయార్జితము

అన్యాయముగ ధనం బార్జించి యున్న[1]
మాన్యమౌ వంశమ్ము మాయు మున్మున్న.

పరవిత్త మాశించి హరియింపకుంట
వరుఁ; మద్దికాక చేకురు ధనం బింట.

---

1 "అన్యాయార్జితంవిత్తం సహమూలం వినశ్యతి".

1. పిఅ≡పళి(ఱ్రి) కూఋవా≡ అన్పళి(ఱ్రి) యుళ్లు≡
తిఅ≡తెరిస్డు కూఅప్ప డుమ్.

2. అఅనోక్కి యాట్రుంగొల్ వై యం పుఅనోక్కి
ప్సు≡సొ లురై ప్పా≡ పొతై.

1. ఉళు(ఱ్రు)దుఋ్డు వాళ్(ఱ్రు)వారే వాళ్(ఱ్రు)వార్ మట్రెల్లా≡
దొళు(ఱ్రు)దుఋ్డు పి≡సెల్బవర్.

2. ఇలమెన్ అశైఇ యిరుప్పారై క్కాణి
నిలమెన్ను నల్లా ణగుమ్.

## పరోక్షనింద

తొలి పరదోషముల్ తూర్పారనిడుట
పలుగాకి తనగుట్టు ప్రకటించుకొనుట.

మునుముందు పొగడి వె న్వెనుక నిందించు
మనుజు మోయునొ యేమొ మహి—విధియంచు.

## అర్థఖండము

### వ్యవసాయము

చేను దున్నెడువారె జీవించువారు
కాని, తక్కొరు వారిగడన కాశింత్రు.

ఏవిధి బ్రతుకని యేడ్చుకర్షకుని
భావించి నవ్వు భూదేవి పక్కు మని.

1. నిలత్తిఱ్ కిడన్దమై కాల్కాట్టుం కాట్టుం
గులత్తిఱ్ పిఱన్దార్వాయ్ చ్చొల్,

2. కుడిప్పిఱన్దార్ కణ్విళంగుం కుఱ్ఱం విసుంబిన్
మదిక్కణ్ మఱుప్పో ఉయర్న్దు.

1. వినై పగై యెన్ఱిరణ్డి నెచ్చ నినైయుంగా
ట్రీయెచ్చం పోల త్తెఱుమ్.

2. వినైయాన్ వినైయాక్కి క్కోడననైగవుళ్
యానైయాల్ యానై యా త్తఱ్ఱు.

## ఆభిజాత్యము.

మొలకచే భూసారము గ్రహింపవచ్చు
పలుకుచే నరునిసత్కుల మెన్నవచ్చు.

కనుపట్టుగా కులీనునికళంకమ్ము
గనుపట్టినటులఁ జంద్రుని కళంకమ్ము.

## కార్య విధానము.

ఒకకార్యమున మఱి యొకటి గూర్పవలెఁ
నొకయేన్గు చేత వే ఱొకటి గొన్నట్లు

అవశేషకార్య, శాత్రవు, లగ్గిరవ్వ,
లవి మానవున కుపద్రవ కారణములు..

1. అణంగుకొ లాయ్మయిల్ కొల్లో కనంగుళై(ழை)
మాదర్కొన్ మాలుమె న్నెంజు.

2. ఉణ్డార్ కణల్ల తడునఱా క్కామంపోఱ్
కణ్డార్ మగిళ్(ழ்)సెయ్దల్ ఇన్ఱు.

3. పణ్డఱియేన్ కూట్రెన్ బదనై యినియఱిన్దేన్
పెణ్డకై యాఱ్ పేరమర్క్కట్టు.

4. కణ్డారుయి రుణ్ణుం తోట్రత్తాఱ్ పెణ్డగై
ప్పేదై క్కమర్త్తనకణ్.

## కామఖండము

### కామము

పసిఁడిబొమ్మయొ, వేల్పు పల్లవాధరియొ,
పసమించు నెమలియో వచియింపఁ దరమె ?

పూనిద్రాక్షాసవం బానఁగాఁ దీపి
కాని ప్రేమ రసమ్ము కనినంతఁ దీపి.

మిత్తి యెట్టిదొకాని మృత్యువే యింతి
నెత్తమ్మిఱేకుల నేత్రాల మూర్తి.

ఆడంబరము లేని యబలకందోయి—
చూడ నేర్పరిపోరఁ, జూపఱు నొంచు,

# విరహము

1. కాణుంగాల్ కాణేజ్ అవరాయ కాణాక్కాల్
కాణేజ్ అవఅల్లవై.

దరినున్నయప్పు డాతనిలోని తప్పు
లరయఁ దోపవు, లేనియపు డొప్పుఁ దప్పు.

2. మలరిను మెల్లిదు కామం, సిలరదజ్
సెవ్వి తలైప్పడు వార్.

సదమలప్రేమపుష్పముకంటె మృదుల,
మదిగ్రహించి భరించు ముదితాత్ములరిది..